"కంటికీ మనసుకీ కనుపించీ కనుపించని

దృశ్యాలందామా? లేక మరి ఏమందాం,

ఏదో అనాలనే అంటే?"

రావు వేంకట మహీపతి

గంగాధర రామారావు, (పిఠాపురము యువరాజు.)

నదులు—మనుష్యులు—జంతువులు—

చెట్లు—వస్తు సముదాయం—

బ్రతుకు—చావు—మళ్ళీ ఏదో

సుఖం—దుఃఖం—మంచి—చెడ్డ—

అది దృశ్యం—అదే అనుభవం—

నేను—

నా భావవికారం—నా ఘనత—నా హీనత—

నా ఉద్దేశాలు—నా ఆశయాలు—నా కలలు—

నా కార్యాలు—నా ఫలితాలు—నా విఫలాలు—

కారణం—కార్యం—అదే మళ్లీ

ఉంకో కార్యానికి కారణం—

అన్నిటికి, అన్నిటికీ లంకెలు---

కాని, దేనికదే—

కొంత తెలివి—కొంత అజ్ఞానం---



# దృశ్యం ౨

పకపకమని పాన్పుమీద నవ్వు—

లబో లబోమని స్మశానంలో మహా రోదన—

ఒకటే సమయం—

మహా సౌధనిర్మాణం - విశ్వమానవ సౌభ్రాత్ర పునఃసృష్టి

తాజ్ మహాలు ధ్వంసం—విశ్వసంస్థకు స్వస్తి—

పిల్లిపిల్ల మరణానికి ఆక్రోశం—రణరంగ రక్తస్రావంలో

జయభేరులు—

ఒక కంటనీరు—ఉంకోకంట నవ్వుతళుకు—

బల్లికి భయం—సింహం అంటే నిర్లక్ష్యం—

స్వార్థత్యాగం—స్వార్థం సర్వం—

కావాలి—వద్దు—

ఒకే మాటు, ఒకే గోళాన్ని సగం చీకటి, సగం వెల్తురు—

ఆగోళం మహావేగంతో తిరగటం నిర్ధారణ కష్టం—

వింతరంగుల కొత్త మెరుపు



# దృశ్యం 3

ఏదో ఆందోళన—ఏదో వాంఛ—

మగత—తెరపి—మగత—ఘనీభవించటం—తదేకధ్యానం—

ఉష్ణం—విరహం—ఉన్మాదం—

శరీరం—హృదయం—రెండూ!

ప్రయత్నం—లేక అప్రయత్నం—

సమ్మేళనం—చిరునవ్వు—కప్పిపుచ్చటం—

అవస్థ—వ్యక్తీకరించటం—ప్రకటన—

అసమ్మతి?—అది వేరుతోవ—కాదు—సమ్మతే

గుసగుసలు—హాస్తం నొక్కులు—

రహస్య సంకేతాలు—రహస్యస్థలాలు—

ఎందుకో రహస్యం!—ఏం తప్పో ?—అది అప్రస్తుతం—

ముద్దులు—పరిరంభాలు—పెనగుట—

స్తనసమ్మర్దనం—శరీర రాపుడి—అగ్నిహోత్రుని ప్రజ్వాలనం-

సంభోగం—అర్థంకాని మాటలు - అర్థంలేని పనులు -

ఉచ్చావస్థ—భావోన్మాదం—

భరించలేకపోవటం—పారావతాలు—

ప్రణయస్థనితం—స్ఖలనం—

బ్రహ్మానందానుభవం—ద్వైతా ద్వైతం—

తక్షణం విరక్తి—మళ్లీ ఉద్రేకం ?—

మళ్లీ విరక్తి—ఉద్రేకం—విరక్తి—పోటు—

పోటు -రంగుల రాట్నం !—

ఇంత వాంఛ—ఇంత బాధ—ఇంత అనుభవం—

ఇంతసంతోషం—ఇంత విరక్తి—

ఆ రెండు వ్యక్తులు—

ఉంకోమారు— రెండువ్యక్తుల విభజనం—

వియోగం కాదు— అది వేరే—

సంపూర్ణ విస్మరణం—

ఉంకో వ్యక్తులుకోసం—ఉంకో ఆటలకోసం—

ఉంకోభావాలు—

వింత ఆశయాలు—వింతకార్యాలు—

వింత ఫలితాలు—

శరీరం, హృదయం, యుద్ధం—

వాటి సామరస్యంకూడా !—

ప్రేమ అంట—వలపంట—

కామం అంట—నే భావం అంటూ !—

తప్పో !—ఒప్పో !—



# దృశ్యం ౪

భర్త చచ్చిపోతున్నాడు గదిలో—

వైద్యుని హడావిడీ—పురోహితుని హడావిడీ—

పక్కగదిలో భార్య వలపుగానితో సంభోగిస్తుంది—

కొడుకు ఒకగదిలో ఏడుస్తున్నాడు—

ఉంకోగదిలో చిన్నపిల్లలు బొమ్మల పెళ్లి చేసుకుంటున్నారు—

నవ్వులు—కొట్టుకోటం—

ఉంకోచోట దూరాన్ని భార్యచెల్లెలు చచ్చిపోతున్న బావ

కోసం యమబాధ పడుతుంది—

ఆమె భర్త ధనార్జనంలో మునిగిపోయిఉన్నాడు—

పిట్టలు ఎగురుతున్నాయి—కుక్కలు మొరుగుతున్నాయి—

కొందరు ఆనందిస్తున్నారు శత్రువులు—

కొందరు మిత్రులు బాధపడుతున్నారు—

చాలానుంది జనానికి ఏవిధం ఐన జోక్యం లేదు—

సర్వప్రకృతి యథాప్రకారం—గాలి యథాప్రకారం—

కాలం యథాప్రకారం—అంతా—ప్రతీదీ—



# దృశ్యం ౫

తుపాకి ప్రేలుడు—దాని పొగ—చుక్కచుక్కల లేడి నేల

మీద—గిలగిల తన్నుకోటం—ప్రాణం విడవటం—రెండు కన్నీటి

చుక్కలుమాత్రం రాలిపోతు నిలిచిపోయాయి—

మృగయా—వినోదం—!

కత్తి తళతళ—అంధకారంలో—అంతలో అమాంతంగా పోటు.—

మానవ గుండెమీద—పెద్ద కేక—రక్తధార—మరణం—

హత్య—అమానుషం—!

నూరు ఫిరంగుల పిడుగులు—ఆకాశాన్ని పిడుగులు—నీటిలో

పిడుగులు—వేలవేల పురుషుల, స్త్రీల, పిల్లల, శరీరఖండాలు

చెల్లాచెదర—మహామారణం—మహారోదన—

ధర్మయుద్ధం—వీరాధి వీరత్వం—!

ఇది భూలోకంలో—మనకు తెలిసున్న లోకంలో, నరకలోకంలో

స్వర్గలోకంలో ఏమిటో !—

అవి మనకు తెలుసునా ?—



# దృశ్యం ౬

స్త్రీలు, పురుషులు—స్త్రీలు, స్త్రీలు—పురుషులు,

పురుషులు—జంతువులు, జంతువులు—

ఆడవి, మొగవి, ఆడవి ఆడవి, మొగవి మొగవి—

జంతువులు, స్త్రీలు—జంతువులు, పురుషులు—

ఇంకా చరాచరాలు—భార్యా భర్తలు—స్నేహితులు—

విరోధులు—బంధుగులు—తల్లి పిల్లలు,—

తండ్రి పిల్లలు—సోదరి సోదరులు—అందరు—

అన్నీ—కలిసి—ఒంటరిగా—!

ఒక విధం ఐన ఆకర్షణ—ఒక విధం ఐన ఆశ—ఒక విధం ఐన

సంబంధం, భావం——ఒక విధం ఐన తృప్తి——

అనేక పేరులు——అనేక విభజనలు——

అనేక ఆంక్షలు——అనేక గారడీలు——



# దృశ్యం ౭

నా శరీరం—నా అందమైనశరీరం—నా వపుశ్సౌష్టవం—నాకు

ఆనందం—నాకు గర్వం—అది సత్యం—అది నాది—అది

నేను—

లోపలి రక్తం, మాంసం, పేగులు, దుమ్ములు, నా సౌందర్యా

నికి అనవసరం——నాకు కనిపించవు——

ఇతరులికి కనిపించవు——అంచే వాటి విచారణ త్యాజ్యం——

అన్నీ ఆలోచించదనానికి వ్యవధి ఏదీ!——ఎన్నో పనులు——!

నా శరీరంనే పోషించుకుంటూ - నా శరీరం కాపాడుకుంటూ

నా శరీరసౌఖ్యం——నాకు ముఖ్యం——అది నా ధర్మం——

ఆసౌఖ్యంనాహృదయసౌఖ్యం ఇస్తది—

హృదయాన్నే కాబోలు, ఆత్మ అంటారు—

నాకు ఆ హృదయసౌఖ్యంకూడా ముఖ్యం—

దానికోసంకూడా ఎంతో కష్టపడతాను—

శరీరసౌఖ్యం— హృదయసౌఖ్యం—

రెంటికీ సంబంధం—అన్యోన్యపోషణ—

నే అనేది, నా శరీరం,

నా హృదయం కలిపి— నా అనుభవంప నేను—

నాకు సౌఖ్యం కావాలి—

ప్రపంచాన్ని ప్రతిదానికి సౌఖ్యం కావాలి—

కారణం ?—గోళాలకి ఆకర్షణశక్తికి

కారణం, చీకటి వెలుగులుకి కారణం—

ఆకలి దప్పికలకి కారణం—

సౌఖ్యం కోరటానికి అదే

కారణం—

# దృశ్యం ౭

ఆకాశంలో కృష్ణపక్షి ఏకగ్రీవం—

గడ్డిమేటుచాటున కాపుగబ్బిగుబ్బెత కులుకులాట—

మహాస్నానాగారంలో మహారాణి విగతవస్త్రయై జలకం

ఆడుతూ తన వపు సౌందర్యాన్ని, ఆనందించటం—తానులో

గుఱ్ఱం తై తక్కలాడటం—

అఖండంగా మహాసంగ్రామం—

మత్తెక్కి కామిని నర్తనశాలలో నృత్యం—

పొదరింటిలో ఇద్దరు స్త్రీలపారావతాలు—

ఎడారిలో ఆకలి దప్పికల హాహారవాలు—

బైరాగి బవిరిగడ్డం—

సన్యాసి గోరిగింపుతల—

నస్యం—సస్యం—

నక్షత్రాలు—నలిగిపోయిన పువ్వులు—

నాచుపట్టిన జలం—బలిసిన చేపలు—మహారాజు—భిక్షు

# దృశ్యం ౬

నీలాకాశం— వెన్నముద్దలు-మేఘంముక్కలు-పచ్చని బీడులు-

రంగు రంగులపూలు-గలగల సెల యేళ్లు—

కలకలపిట్టలు—

చల్లని గాలులు—

గమగమసౌరభాలు—

ఎత్తైన కొండలు–లోతైన లోయలు—

తెల్లని ఇసుక – చక్కని కడలి—

కొంత స్పష్టం – కొంత అస్పష్టం—

వ్యక్తం—అవ్యక్తం—

రంగం—

శోభనపుగది—స్మశానవాటిక—

స్వేచ్ఛాసోపానం—కారాగారం—

కొందరికి కొందరికి - కొన్నిటికి కొన్నిటికి—

ఎందరికో—ఎన్నిటికో—

# దృశ్యం ౧౦

గడ్డిపూచని మేక కొరికివేసింది—మేకని మెకం తిని వేసింది—

మెకాన్ని వేటకాడు చంపివేశాడు—వానిని మహామారి ఆఖరు

చేసింది—ఇదంతా చూచోచూడకో ఒక తాపసి మహాశాంతంతో

అహింసామంత్రాన్ని మనన చేస్తున్నాడు—

ఉంకోచోట కుష్ఠురోగంతో బాధపడుచు ఒకడు దేవుడే లేడని

శపథం చేసేడు—

ఉంకొకడు తనప్రార్థనకు ఫలితం కనిపించకపోతే ఏడుస్తూ దేవు

డున్నా తనకు సంబంధం లేదని గొంతెత్తి చెప్పేడు—

దేవుడనేది ఒక క్రూరమైన శక్తి అని పిల్ల చచ్చిపోయిన తల్లి

వ్యాపించింది---

కరుణానిధి దేవుడని తన మొక్కో, ప్రార్థనో ఫలించిన ఈప్సి

తార్థ ప్రాప్తిపూర్ణుడు నొక్కి చెప్పేడు—

వల్లెయని కాబోలు ఆత్మానంద సౌఖ్యం పొందుతు సమాధిలో

మునిగిన యోగి నిశ్శబ్దంతో ఢంకా కొట్టేడు—

ఆ పక్కనే దొంగలు దోచుకున్నారు—వర్తకులు సామగ్రి

అంతా ఆక్రమించుకొని విపరీతధరలకు వాటిని అమ్మేరు—

పన్నులువేసి పండినపంట లాకున్నారు మరికొందరు—

పాలికాపుకి గంజినీళ్లుపోసి రైతువాడి చెమటతో సస్యాన్ని

ప్రోగు చేసికొన్నాడు—

మహాక్రోధంతో వల్లు తెలియక ఒకడు ఒకతెను పొడిచి చంపేడు-

జీవన్మృత్యువులు, పాతబట్టలు విప్పి కొత్తవి కట్టటం అని గీతా

వాక్యాన్ని వేదాంతి బోధించేడు—

అపుడే ఒక పిచ్చివాడు ఏదో తనపిచ్చిలో ఏవేవో పిచ్చిపనులు

చేసేడు—



## దృశ్యం ౧౧

వెచ్చనిమట్టి—హాయిగా పొరలుదాం—

దానితో ఏకీభావం—మనభూమి—మనకోసం పుట్టిన భూమి-

మన శరీరం మన అనుభవంకోసం

మన శరీరం—శారీరసౌఖ్యం అనుభవించుదాం—

ఆకలి ఒక గొప్పభాగ్యం—పంచభక్ష్య పరమాన్నములతో ఆకలి

తీర్చుకొనేసౌఖ్యం అనుభవించుదాం—

మంచినీరు, మధువు తాగి దప్పిక తీర్చుకొని మత్తెక్కి సుఖిం

చుదాం—

కామం—దానితృప్తిపరచే విధానాలు—

చాలాసౌఖ్యం—తప్పక ఆ అనుభవంలో తేలిపోదాం—

దురదవేస్తే నిశ్శంకగా గోక్కుందాం—

ఎంతోసుఖం—

మెత్తని పక్కమీద పడుకుందాం—

సుఖంగా నిదరపోదాం—

ఆకాశాన్ని చూద్దాం—వెన్నెల చల్లదనాన్ని స్వీకరించుదాం—

సంగీతం కోలుదాం—సౌరభం ఆస్వాదించుదాం—

పిల్లలని ముద్దుపెట్టుకొందాం-భార్యలని పరిరంభంచేద్దాం-స్నేహి

తులతో కబుర్లు చెప్పుకొందాం—ఆకలి ఉన్నవాడికి ఇంత అన్నం

పెట్టి తృప్తిపొందుదాం—పుస్తకాలు చదువుకొందాం—

వ్రాద్దాం—బొమ్మలు చూద్దాం—

మనకోరికలు ఎన్నో ఉన్నాయి—

పూర్తిగా అనుభవించాలి—

లేనిదానికోసం వ్యథత్యాజ్యం—ఆ ఊహే అనవసరం—

ప్రస్తుతం ఏపరిణామం—

అనుభవంప సత్యం——

ఎన్నో కష్టాలున్నా, ఎన్నో సుఖాలున్నాయి——

ఏడిస్తే, ఇక నవ్వే లేదా——

కన్నీళ్లు కడిగేసి పీలైనప్పుడల్లా నవ్వుదాం—

అవకాశాలకేం ।——కావలసినన్ని ఉన్నాయి——

# దృశ్యం ౧౨

ఎప్పటికి బతకాలని లేదు—ఎక్కువదినాలు ఈ లోకంలో ఉంటే

విసుగు—ఎక్కువరోజులు ఈశరీరంలోనే కాపరం అయిష్టం—

ఏ అరవై ఏళ్లో చాలు—అదికూడా ఎక్కువఏమో!

త్వరగా చచ్చిపోవాలనీ లేదు—ఏం ఈలోకం బాగానే ఉందే—

చచ్చిపోయీ చేసేదేవిఁటీ ?——

బ్రతుకు చావులు గొప్పవిషయాలు కావు——

రెప్పవేయటం గొప్ప విషయమా ?

బాగా తెలియనంత మాత్రాన్ని గొప్పవికావు విషయాలు——

ఏఁవంటారు !——

ఉన్నంతకాలం సంపూర్తిగా, తృప్తిగా జీవించేయటమే—

వెడలిపోయేటప్పుడు సంపూర్తిగా, తృప్తిగా చచ్చిపోవటమే—

ఆపైన—అది ఊహ—ఊహా శక్తిలో ఆనందించేవాళ్లు ఆ ఊ

హలో ఆడుకోవచ్చు—

ఇక్కడ ఆడుకున్నట్లే—

ఆ ఆటలంటే విసుగైనవాళ్లు ఆజోలికి పోనక్కరలేదు——



# దృశ్యం ౧౩

దేవాలయం — ఘంటానాదం —

కర్పూరహారతి — ధూపం — గంధం — పుష్పాలు —

ఫలాలు — పూజా సామగ్రి —

పూజారులు — పూజ —

గర్భగుడిలో చీకటి—

మూలవిరాట్టు విగ్రహానికి పెద్ద పగులుబీట—

ఆ బీటలో ఎలక దూరింది—

విగ్రహం—వెనుక పిల్లి ఎలుకకోసం వేచిఉంది—

దేవాలయంముందు కుక్క చచ్చిపడి ఉంది—

పుణ్యగుండంలో యాత్రికులు వంటి మురికి కడిగేరు—

ఊళ్లో పూజారి భార్య దేవతార్చన గదిలో పాలికాపుపక్కలో

పడుకుంది—

పాలికాపు లేని పొలంలో కాకులు గింజ లేరి తింటున్నాయి—



# దృశ్యం ౧౪

కాలం— అవకాశం—

కొన్నాళ్లకు ఒక పెద్దనది ప్రశాంతంగా అడవులమధ్య పచ్చిక బయళ్ల మధ్య ప్రవహించుచున్నది...— మేఘాలు అందులో ప్రతిబింబించేయి—

చిన్న చిన్న పడవలలో మనుష్యులు అనేక సామగ్రులతో ఎక్కడి

నుండో పైనుండి నదిలో ఆ చోటుకి వచ్చేరు. కొందరు దిగకుండా

పడవల్లో ప్రయాణం సాగిస్తూ ప్రవాహాన్ని అనుసరిస్తూ వెళ్లి

పోయారు—

కొందరు ఆ పచ్చిక బయళ్లమీద మకాం చేసేరు—

అచ్చుట సంసారాలు పెరిగేయి—పెద్ద పట్టణంకూడా పెరిగింది-

కాలం—

కాలం—సంసారాలు చితికి పోయాయి—జనం తగ్గిపోయారు—

ఇతర చోట్లకు సాగిపోయారు—మహాపట్టణం పాడుపడిపోయింది-

పొదలతో చెట్లతో అడవిలో చేరిపోయింది—

ఆ నది ప్రశాంతంగా ప్రవహించుచున్నది — మేఘాలుకూడా

అందులో ప్రతిబింబిస్తూనే ఉన్నాయి—

కొన్నాళ్లకి ఆ నది ఎండిపోయి మాయమైంది— నది లేకపోతే

మేఘాల ప్రతిబింబం కూడా మాయమైంది—

కాలం—అవకాశం—



# దృశ్యం ౧౫

చీకటి వెలుగుకాని నీలం—

దానిక్రింద చీకటితెర—

దాని కడుగున అర్ధచంద్రాకారం గల వెలుగు—దానిక్రింద అవ

కాశం—అదే కాలం లాగకూడా కనిపిస్తుంది—

అంత, భూమి —రత్నగర్భ, సస్యగర్భ, శిలాగర్భ, మృత్తుగర్భ,

జలగర్భ, అగ్నిగర్భ—

భూమిమీద గడ్డి, ముళ్లు—

దానిపై పూలపాన్పు—

ఆ పాన్పునకు రెండువైపుల రెండు మెరుపు స్తంభాలు—

పొన్నుపై అవ్యక్త సౌరభం, పట్టుఛాదినీ—

ఆపొన్నుపై లింగభేదము స్పష్టముగా కనిపించని ఒకవ్యక్తి నిద్రించు

చున్నదో, ప్రాణహీనమైందో తెలియదు—

గాలివల్ల కాబోలు పూలు కొంచంకదలి మళ్లీ ఊరుకుంటున్నాయి-



# దృశ్యం ౧౬

ఇంద్రధనస్సు—వెన్నెల—చందనం—

తేనె—అమృతం—రతిసౌఖ్యం—

వీటి సమ్మేళనం—ఒక అపూర్వపదార్థసృష్టి—

దాని ఆస్వాదనం—అపూర్వానుభవం—

కొత్తమత్తు-కొత్తతాండవం——

ఉచ్ఛావస్థ——సర్వవిస్మయం——

మాంద్యం——వికారం——

తల తిరగటం——వాంతి——జ్వరం——

తీవ్రత——మహాబాధ——గిలగిల——

అస్పృహా——సర్వవిస్మయం——

విస్మయం !—— విస్మయం !——

అదీ విస్మయం !—— ఇదీ విస్మయం !——



# దృశ్యం ౧౨

ఈ బురద వద్దని, ఈ మట్టిలో మాసిపోతున్నానని, ఒకడు ఎగి

రేడు—

భూమిని విడిచిపెట్టాలని విశ్వప్రయత్నం—ఆకాశాన్నో, ఉంకో

లోకాన్నో విహరించాలని ఆశ—

కాని ఒక బుద్ధిమంతుడు వ్రాసినట్లు, భూమినుంచి రెండు మూడు,

నాల్గు అడుగులు కన్న ఎక్కువపైకి వెళ్ల లేదు—శక్తిలేదు—

భూమి లాగింది. ఒకపావునిమిషం అన్నా భూమిని విడువలేక

పోయాడు—మళ్లీ భూమిమీద పడ్డాడు....

బురదతో లంకె—మట్టిలో పాతుక—

బురద మెత్తగా ఉంది!

మట్టి వెచ్చగా ఉంది!—



# దృశ్యం ౧౨

కొండవెనకనుంచి ఒక చిన్న నల్లని మేఘంలాంటిది కనిపించింది —

విమానం హోరు—

క్రమంగా అది పెద్దమేఘం ఐంది —

హోరు అతిశయించింది—సమీపించింది—అది మిడతలదండు—

వందలు, వేలు, లక్షలు, కోట్లు, మిడతలు—

రయ్యిమని సుసస్యమైన, విశాలమైన పొలంమీద వాలింది—

కొన్నినిముషాలలో మిడతల దండు లేచింది—రయ్యిమని వెడలి

పోయి, దూరాన్ని మేఘంవై, క్షీణించి, మాయమైపోయింది—

ఆ పెద్దపొలంలో ఒకగింజ ఐనా మిగలలేదు—సర్వం ధ్వంసం—

అనేకనెలల కృషి వ్యర్థం ఐంది—

మానవునికే కావచ్చు !— వర్షం వ్యర్థం ఐంది—

భూమిరసం వ్యర్థం ఐంది—

కొన్నాళ్ళకు మళ్ళీ వర్షించింది—

కర్షకులు దున్నేరు—గింజ లేసేరు—భూమి మళ్ళీ పంట

# దృశ్యం ౧౯

హోరుమని మోత—మరల గిరగిర—బొగ్గుపొగ.....ఆవిరిశబ్దం-

విద్యుచ్ఛక్తి చప్ చప్‌లు —

ఇనుప సామగ్రికంగులు—

డబడబలు—దబదబలు......

మరల యుగం—యంత్రసామ్రాజ్యం—

ఫాక్టరీలు—పనివాళ్ల సమూహం—

వారిశ్రమ—అధికారులసభ—వారిధనం—

సమ్మెలు—సమ్మతులు—

నేల వేల వస్తునిర్మాణం—

పిన్నులు, కత్తులు, తుపాకులు, యంత్రాలు—

సుత్తులు, వస్తువులు, ట్రాక్టరులు, బాంబులు, ఫిరంగులు, ఇంజ

నులు, విమానాలు—

రాత్రి, పగలు—ఏకధాటిగ—

నిర్మాణంకోసం— నిర్మూలంకోసం-తల - వల్లు--- హృదయం---

# దృశ్యం ౨౦

గొప్ప తప్పేడు—కట్టేడు— ఫలితం—

హాయిగా—

పువ్వులు వాసన చూసేడు—కూరలు,

పళ్లు ఆప్యాయంతో తిన్నాడు—

కాడికి ఎద్దులుకట్టి దున్నేడు—

ఆకాశాన్ని చూచేడు—ఊరుకున్నాడు—

వర్షించింది—గింజలు చల్లి మళ్లీ ఆకాశం చూచేడు—

వర్షం లేదు— భయం వేసింది—

పోలేరమ్మకు మొక్కుకున్నాడు—

వర్షం కురిసింది— నిట్టూర్పు ఇచ్చేడు—

కొంచం పోయింది—చాలా పండింది—

గింజలతో తలవంచిన చేనుమధ్య కిర్రు చెప్పులతో పెద్దకర్రతో

ఠీవిగా షికారు చేసేడు—

కోతలు కోస్తుంటే కాపుపడుచులతో పరియాచకం ఆడేడు—

ఆకాశాన్ని చూసేడు—మబ్బేసింది—కంగారుతో వానరాకుండా

మళ్లీ మొక్కేడు—

చిన్న చినుకులుపడి వాన ఆగిపోయింది—

కుప్పేసి తొక్కించి గాదిలో చేర్చేడు—

సంక్రాంతిపండుగ సంతోషంతో గడిపాడు—కూతురుని అల్లు

డీని తీసికొచ్చి బట్టిచ్చి సాగనంపేడు—

సిస్తు ఇచ్చేడు—కొంత నసుక్కున్నాడు—గాదిలో ఎలుకలు

కొన్ని గింజలు తిన్నాయి—

ధర బాగుంది—మంచిధరకి అమ్మేడు—

జాతర్లకి వెళ్లేడు—పిల్లలని పుట్టించేడు—

సుఖానికి నవ్వేడు—బాధకి ఏడ్చేడు—

చాలాసంవత్సరాలకి చచ్చిపోయేడు—

తరువాత వానికొడుకూ ఇవన్నీ చేసేడు—

తరువాత వాని మనవలు, మునిమనవలు అదే చేసేరు—



# దృశ్యం ౨౧

బర్ మని కారు వెళ్లిపోతుంది——

కో అని రైలు వాయువేగాని వెళ్తోంది——

స్ స్ స్ అని స్టీమరు ప్రయాణం అవుతుంది——

జుమ్ అని విమానం ఎగిరిపోతంది——

గణగణమని ఎద్దులబండి నడుస్తుంది—

పడవ లాగుతూ పాడేరు పడవవాళ్లు—కర్రపట్టుకొని నడిచేరు

పాలికాపు—

మహాపట్టణం కలకలం—దానిపక్కని పచ్చనిపొలాలు నిశ్శ

బ్దంలో—అందులో ఉన్న పశువులు మెడెత్తి విమానాన్ని

చూచేయి—

దూరాన్ని కొండలు—వానిమీద మేఘాలు—

దూరాన్నించిచూస్తే వస్తువిభజన తెలియటంలేదు—

ఇంకా దూరం వెళ్ళూచూస్తే అంతా అలికిపోయి, క్రమంగా

అదృశ్యం—



# దృశ్యం ౨౨

చచ్చిన ప్రియుని ముద్దుసుద్దులు—

చావని ప్రియుని లెంపకాయలు —

పాతప్రభువుల గిలిగింతలు —

కొత్తప్రభువుల చండశాసనాలు—

వాడిపోయిన పూతల సౌరభం—

వాడనిపువ్వుల పచ్చివాసన—

వెఱ్ఱివెధవలకి—వెంగళప్పలకి—

వేదాంతులకు—విద్వాంసులకు—మానవులకు—

తియ్యనితేనే భ్రమరాలికి—

చల్లనివెన్నెలే చకోరానికి—

ఉన్నవె ఔను, లేళ్లకు, చెట్లకు, రాళ్లకు—

వానికికూడా పాతవాసనల పరిరంభాలో!—

వానికికూడా హృదయవేదన, కంటినీరో !—



# దృశ్యం ౨౩

భూవిశ్వం మానవుడు ఆక్రమించుతున్నాడు....

అలా అనుకున్నాడు—

ప్రకృతినికూడా శాసించేడు—

జంతువుల్ని, పిట్టల్ని, చేపల్ని, పురుగుల్ని, చెట్లని, రాళ్లని,

జయించేడు—

వాని హక్కుల విషయం ఐకాని, వానివిషయంఐకాని చింతే

లేదు—తనకోసం, ఇదంతా ఉందన్నాడు—సృష్టిలో తనే అధి

కుడనుకొన్నాడు—దేవుడుకూడా తనకోసం ఉన్నాడని ఊహ—

ఇది దౌర్జన్యం ఆ!—దొంగతనం ఆ!—

# దృశ్యం ౨౮

కథకుడు చెప్పేడు మంచికథ—ఉద్రేకంతో చెప్పేడు—

భూతాన్ని వర్తమానం క్రింద చేసేడు—

ప్రణయం—విరహం—సంయోగం—

ఆనందోద్రేకం—హృదయతాపం—కన్నీళ్లు—రక్తధారలు—

కాశంలో మెరుపులు---మేఘాలమీద ఇంద్రధనస్సు—సము

ద్రంలో తళతళమనే రత్నాలు—

భూమి కంపించే శౌర్యం, క్రూరత్వం, ప్రేమ, స్వార్థత్యాగం—

మానవత్వం--దైవత్వం—రాక్షసత్వం—

ఇవన్నీ హృదయోత్పాతం కలిగేటట్లు జీవనం పొంగేటట్లు ఏక

ధాటిగా వర్ణించేడు —

వినేవాడు నిద్రపోతూ ఊకొట్టేడు —



# దృశ్యం ౨౫

" ఏం ? "

" ఏంవీ ( లేదు—— "

" ఊరుకున్నావేం ? "

" ఊరుకోక !—— "

" చెయ్యాలి—"

" ఏంచేయాలి ? "

" ఏదైనా సరే—"

" శక్తిలేదు—"

" చాటు పెయ్యావా !—"

" కావచ్చు—"

" ప్రయత్నించు —"

" ఆ వాంఛా లేదు —"

" ఐతే ఎందుకు బ్రతకటం—"

" నాకూ తెలియదు—"

" చచ్చి ఏంచేస్తావూ ?—"

" అదీ నాకు తెలియదు—"

" ఐతే చావాలని ఉద్దేశం అనవసరం—"

" చావాలని నాకుంటేగా !—"

" ఐతే వాంఛ ఏవిటీ, కర్తవ్యం ఏవిటీ ?—"

"వాంఛ లేదు—కర్తవ్యం లేదు—"

"ఎందుకింత విరక్తి?—"

"విరక్తి లేదు—"

"మరి ఏమిటీ?—"

"మరి ఏమిటేమిటీ?—"



# దృశ్యం ౨౮

వీరాధివీరుని శిలాప్రతిమ—గుర్రాన్నెక్కి, దివ్యమైన సర్వ సేనా పతి దుస్తులలో, ఖడ్గాన్ని వరనుండి తీసి, మెరుస్తున్న వీరత్వం చూపిస్తూ, మహాసైన్యాన్ని యుద్ధరంగానికి నడిపిస్తున్న పూర్వ మహాచక్రవర్తి.—

ఆ శిలాప్రతిమ పక్కనే ఇంకొక శిలాప్రతిమ—చిరిగినబట్టతో,

చెదరిన వెంట్రుకలతో, వంటికాలిధూళితో, బహిరంగపరుపబడిన

వక్షస్థలంతో, రక్తనేత్రాలతో, అరుస్తున్న గొంతుకతో, ఒక

చేతిలో విరిగినకర్ర, ఉంకో చేతిలో ముక్కపోయిన గొడ్డలి

చూపిస్తూ, గోలచేస్తున్న, ఒక పెద్ద జనసమూహాన్ని తనవెనుక

తీసికొస్తూ సర్వాధికారాన్ని ఎదిరిస్తున్న ఒక ఆధునిక విప్లవనాయ

కుడు—

ప్రేక్షకులు మొదటిప్రతిమని కొంచంసేపు రెండవదానిని కొంచం

సేపు చూసేరు—



# దృశ్యం ౨౭

ఒక పెద్ద నీలంరంగుకల మండపం—

దానినిండా, నల్లని చీకటి స్తంభాలు,

తెల్లని వెలుగు స్తంభాలు ---

చాలామంది స్త్రీలుపురుషులు పల్ల స్తంభాలాట ఆడుకుంటున్నారు-

నల్ల స్తంభంఐనా తెల్ల స్తంభం ఐనా తాకి ఆశ్రయించి ఉన్నంత

సేపు తమ సర్వాశ్రయం అని గట్టిగా పట్టుకొని తమదానిగా

భావించి దగ్గరగా ఉన్నారు—దొంగ దూరంగా ఉంటే విడలేక

విడలేక ఆట జరగాలని విడిచిపెట్టి గుండెబెదరుతో పరుగెట్టి

ఉంకో స్తంభాన్ని పట్టుకున్నారు—గుండె నిబ్బరంపడింది—అది

కొత్తగృహం—తమది—ఇదివరకు దానిని ఎవరు ఆశ్రయించి

విడిచిపెట్టేరో అనేది ఆటకు అనవసరం—తాము విడిచిపెట్టింది

ఎవరు ఆక్రమించేరో అనేదికూడా అనవసరం—

చీకటిస్తంభాలు ఆశ్రయించినప్పుడు చీకట్లో ఉన్నారు—

వెలుగుస్తంభాలు ఆశ్రయించినప్పుడు వెలుగులో ఉన్నారు—

ఆటలో దొంగ కొంతసేపటికి, తన దొంగతనాన్ని పోగొట్టు

కొన్నాడు—కొత్తవాడు, స్త్రీ ఐతేనేం, పురుషుడైతేనేం !, దొంగ

య్యేడు—

ఆట జరిగిపోతుంది.......



# దృశ్యం ౨౧

అక్కడక్కడ మాటలు వినిపించేయి ఒకేమారు, వింటుంటే —

“ నాయనా, రా, అన్నం పెడతా ! ”—

“ అమ్మా, వద్దు— ఆకలి లేదు ”—

“ ప్రియుడా, రా, ఉద్రేకంతో వేచిఉన్నా ! ”—

" రాలేను,—బద్ధకంగా ఉంది "—

''బుద్ధిలేదూ,— ఎన్నిసార్లు చెప్పాలి ! ''—

'' ఏవిటో వినిపించటంలేదు— నాకు చెవుడు ''—

" నీకోసం తపిస్తున్నా—ఉండు ! "—

'' నిన్ను నేను ఇక ప్రేమించలేకపోతున్నా— వెళ్తా ''—

" ఈ పువ్వులు ఎంతబాగున్నాయో! "—

" పరిమళంలేదు—ఏడ్చినట్లున్నాయి "—

" నేను ఎక్కడున్నాను ? "—

" ఎక్కడో ఉన్నావు—కాని ఎక్కడో తెలియదు "—

" ఇంకా, ఇంకా ! "—

# దృశ్యం ౨౯

పొగ — ఫాక్టరీచిమ్నీనుండీ వచ్చింది — ఎంజను గొట్టాంనుంచి

ఎగసింది — విమానం క్రిందనుంచి బయలుదేరింది — —

అవదందీపంనుంచి పొగ — —

కాల్చివేయబడుచున్న శవంనుంచి పొగ — —

దేవుని మంగళహారతి పళ్లెంనుండి పొగ—

భూవినుండి పొగ—ఆకాశాన్ని పొగ—

పొగాకుచుట్టనుంచి పొగ—

లక్షాధికారి బంగారురేకు అన్నంనుండి పొగ—

భిక్షాధికారి గంజినీళ్లనుండి పొగ—

కావలసినంత పొగ—గర్వములేనిపొగ-విశ్వమానవ సమభావము

కల పొగ—



## దృశ్యం ౩౦

విమానం ఆకాశాన్ని వెళ్లుతుంది—

దాని తలుపు తీయబడింది—

సైనికులు దానినుండి 'పేరచూట్లు' కట్టుకొని శత్రుభూమిపైకి విడవబడ్డారు—

కొందరి 'పేరచూట్లు' విడవబడలేదు—వాళ్లు తలక్రిందులౌతూ

ఆకాశాన్నుండీ వేగంగా భూమిమీదపడి ముక్కలయ్యేరు—

కొందరు మధ్యమార్గాన్నే శత్రుశతఘ్నులకు గురియై నశించి

పోయేరు.—

మరికొందరు నేలపై పడగానే కొద్దిమంది శత్రుసైనికులచేత

బంధింపబడ్డారు—

ఇక కొందరు నేలచేరి లేచి తమ ఆయుధాలు మొదలైనవాటిని

సరిచేసికొని, ఆ సైనికులను చంప యత్నించి వారిచే చంప

బడ్డారు—

మిగిలినవాళ్లు ఆ శత్రువులను చంపి అక్కడ ఉన్న యుద్ధయంత్రా

లని నాశనంచేసి చిన్న తెప్పల్లో ఎక్కి సముద్రంలో వేచియున్న

తమ యుద్ధనావను చేరేరు—

చేరకముందే శత్రుశతఘ్నులకు ఆహుతి అయ్యేరు కొందరు—

మిగతావారు నావనెక్కి సురక్షితంగా స్వదేశపు రేవు చేరేరు—

చేరి కొందరు జబ్బులుచేసి పక్కలమీద మరణించేరు—

కొందరు సుఖంగా జయాన్ని అనుభవిస్తూ శలవులు గడిపేరు —



౧_౨౦

# దృశ్యం ౩౧

అన్యోన్యం ఐన మహాప్రేమతో ఇద్దరు వివాహం చేసికున్నారు—

సుఖాలు అనుభవించేరు—

ఒకనాడు భార్య మునిగిపోతుంటే తనప్రాణానికి లెక్కచేయక

ప్రవాహంలో దూకి ఆమెను రక్షించేడు—

ప్రేమచేసిందా కార్యం—

కొన్నాళ్లకు ఆమె ఇంకొకణ్ని వలచింది—భావోద్రేకంతో ఆ

నూతనప్రియునితో అనుభవించింది—

అదిచూచి భర్త ఆమెను చేతులతో మెడపిసికి చంపేసేడు—

ప్రేమచేసిందాపని—

తరువాత ఏడుసూ భర్త బాకుతో పొడుచుకొని తాను చచ్చి

పోయాడు—

వలపుకాడు చచ్చిపోయిన తన ప్రియురాలి శవంచూచి కౌగలించు

కొని ఏడ్చేడు—భరించలేని విచారం, అంత ఉద్రేకం ఏకంకాగా

ఆశవాన్ని భావోద్రేకంతో కలిసి అనుభవిస్తూ రతికేళిచేసేడు—

చచ్చి ఉన్న భర్తశవం తినాలని నక్కలు చూస్తూ ఉన్నాయి—

ఊరికే నక్షత్రాలు కళ్లుమూస్తూ తెరుస్తూ చూస్తున్నాయి—



# దృశ్యం ౩౨

ఘోరంగా వర్షం—హోరుమని గాలి—

దట్టమైన చీకటి——మిరుమిట్లుకొలిపే మెరుపులు—

భార్యాభర్తలు గట్టిగా కౌగలించుకొన్నారు——

చంటిపిల్ల 'బారు' మన్నది—

ముసలివాడు ముసుగు తన్నేడు—

ఒకడు నిద్రలేచేడు—ఒకడు నిద్రపోయేడు—ఒకడికి ఆకలేసింది-

దొంగలు కన్నంవేయడానికి బయలుదేరేరు—

విరహం భరించలేక జారులు తమ ప్రియజారిణుల రహస్యంగా

చేరేరు—

పిట్టలు గూళ్లలో కిచకిచమన్నాయి—

జంతువులు గుహాలో దూరేయి—

చేపలు నీటిలో ఎప్పటివలె ఉన్నాయి—

కవి పాడేడు—యోగి యోగనిద్రలో తత్వానుభవం అనుభ
వించేడు—



# దృశ్యం 33

పెద్దకడుపు—పెద్ద బోడితల నిగనిగలాడతంది—

చిన్నికళ్లు మెరుస్తున్నాయి—పంచభక్ష్య పరమాన్నంతో కూడిన

భోజనం ఆరగిస్తున్నాడు—భోజనంచూచి ఊరికే పొంగిపోతు

న్నాడు—నవ్వుకొంటున్నాడు—రచయితలాంటివాడు

ఒకడువచ్చి "అయ్యా మీకు మహారాజాగారు లక్షరూపాయల

భూమి దయచేసేరు"—

భోక్త, పకపక నవ్వేడు—పెద్దముద్ద నోట్లో పెట్టుకొన్నాడు—

ఇంకొకడువచ్చి "అయ్యా దొంగలు మీగాది అంతా దోచు

కొన్నారు—పొలంలో ఇల్లు తగలబెట్టేరు"—

భోక్త పకపకనవ్వి, రెండుముద్దలు నోట్లో పెట్టుకొన్నాడు —

మరొకడువచ్చి "అయ్యా! అమ్మగారు, క్షమించండి, సాకలోడితో

లేచిపోయేరు"—

భోక్త కడుపు పట్టుకొని పకాపకా నవ్వుచు పెద్ద గారిముక్క

తిన్నాడు—

మరి ఒక అసామివచ్చి "అయ్యా, తుపాను వస్తంది, తలుపు

వేస్తేనే కాని తడిసిపోతారు, విస్తరి ఎగిరిపోతది"—

భోక్త పకపకనవ్వుచూ గబగబా మూడుముద్దలు పెట్టుకొని,

అప్పడం తుంపేడు—

మరోమనిషొచ్చి, "మీ కూతురు అయ్యా, ప్రసవిస్తా చచ్చి

పోయింది''—

భోక్త పకపక నవ్వుకుంటూ పాయసం తాగేడు—



# దృశ్యం ౩౪

కొందరికి రోజుకి ఒకరుచి—రోజురోజూ కొత్తకూర—

కొందరికి ప్రతిదినం కొత్తప్రియులు—

నిన్నచూచింది మళ్లీ నేడు అంత రుచించదు....

కొందరికి రోజూ ఒకకూరే కావాలి—అది లేకపోతే వారు ఉండ

లేరు—

కొందరికి ఎప్పుడు ఒకతే ప్రియురాలు కావాలి—ఆ ఏకత్వంలోనే

వారి మహారుచి—

'లోకోభిన్న రుచిః'—

ఇందులో ఒకటి ఉత్తమము అనికాని ఒకటి అధమము అనికాని

# దృశ్యం ౩౫

"భయం లేదు—నాచేయి పట్టుకో—జాగ్రత్తగా తీసుకువెళ్తా—

నే దీపం చూపిస్తా—ఆ వెలుగులో చూడు—ఆకాశం చూడాలని

కంగారుపడకు—ఆకాశం అని అవకాశం అని ఏవీ నిజంగా లేదు -

రెండువస్తువులమధ్య ఏవీ లేనిది అవకాశం"—

"కాలికింద ఉన్న భూమిని ఎక్కువ పరీక్షచేయకు—పట్టిమట్టి—

ఆలస్యం అని తొందరపడకు—కాలం అనేది మిథ్య— రెండు

సంఘటనాలకు మధ్యనున్న ఏవీకాని విరామం కాలం—నడు—

అంతే—చూస్తూ గోతిలో కాలువేయకు —నడవాలని లేనప్పుడు

ఊరుకో— ఊరుకోవాలని లేనప్పుడు నడు"—

"ఇది స్వర్గం కాదు—నరకం కాదు—భూమి—అందరాని దాని కోసం ఆతురతవద్దు - ఏడ్పువచ్చినపుడు ఏడు—నిశ్శంకగా ఏడు-నవ్వువచ్చినప్పుడు కడుపార నవ్వు"—

"చూస్తూకొన్ని, కొన్ని చూడకుండా, ఒక చీనాదేశపు వేదాంతి అన్నట్లు ఒకకన్ను మూసి చూస్తూ, ఒకకన్ను తెరచి నిద్రపోతూ,

సుఖంగా కాలంచేయి — సుఖించాలని ఉన్న మనం సుఖిం

చేద్దాం ''——

''చూడు— ఒకమాట—నీ ధైర్యంకోసం నాచేతిని పట్టుకోమన్నా,

నా ధైర్యంకోసంకూడా నీచెయి పట్టుకుంటన్నా ''—



# దృశ్యం ౩౬

రంగురంగుల పిట్ట——భూమిమీద నివాసం—— అందే ఆహారం——

ఆకాశాన్ని విహారం——

స్వేచ్ఛాజీవినని విర్రవీగటం——

ఎంతో ఎత్తు ఎగిరిపోవటం——

ఆపైన ఎగరలేకపోవటం.—

ఆపైమాట—ఆ పిట్టమాట—అది వేరేవిషయం.—



# దృశ్యం ౩౭

సంపంగిపువ్వు— సొంపైనపువ్వు—నాసికాఘ్రాణం—

మనసునుబట్టి— ఇచ్ఛనుబట్టి —

ఏదితలస్తే ఆపరిమళం—

స్త్రీతలలో సింగారం—

భ్రమరునికి ఆవాసనే అయిష్టం—..



# దృశ్యం ౩౮

అది ఒక కళాగారం—

చిత్రకారుడు చిత్రించేడు—అపూర్వసృష్టి—

శిల్పి చెక్కేడు— కొత్తబొమ్మని—

కవి రాసేడు—నూతనపదం—

గాయకుడు పాడేడు—నవీనరాగం—

కాని కళ్లున్నవాళ్లెందరో చూడలేదు—

చెవులున్న వాళ్లెందరో వినలేదు—వాళ్లకు వేరేపనులు—

వారిప్రశ్న—సృష్టించిందల్లా అందరిచే అనుభవింపబడాలో !—

సృష్టలప్రశ్న—ఎందరో ఎందుకు అనుభవించకూడదూ ఈమా

# దృశ్యం ౩౬

బీడుల్లో ఉన్న ఆవులు ఆకాశం వెంపుచూస్తున్నాయి —

చెట్లమీదున్న పిట్టలు ఆకాశంవెంపే చూస్తున్నాయి —

పొలాల్లో ఉన్న గడ్డిపూచలు ఆవైపే చూస్తున్నాయి —

మిద్దెలపై ఉన్న మనుష్యులుకూడా ఆవైపే చూస్తున్నారు —

ఆకాశం నిర్మలంగా ఉన్నది—



## దృశ్యం ४०

నేను — పువ్వులు — బూడిద —



## దృశ్యం ४౧

అగ్నిహోత్రం — జలపాతం .....

చీకటి— వెన్నెల—

సముద్రంపహోరు—



## దృశ్యం ౪౨

వర్షం— కప్పల బెకబెకలు—



## దృశ్యం ౪౩

రెండుతలల పాము



## దృశ్యం ౪౪

అంధకారంలో విద్యుల్లేఖ—



## దృశ్యం ౪౫

తళతళలాడే కత్తికి ఎర్రని రక్తపుచుక్కలు----



## దృశ్యం ౪౬

విరిగినకాలు----గుడ్డికన్ను--

చిరునవ్వు —



# దృశ్యం ౪౭

చీకటి—



## దృశ్యం ౪౭

భళ్లున తెల్లవారింది—



## దృశ్యం ౪౮

దక్కని పువ్వు—పరిమళం లేదు—



## దృశ్యం ౫౦

కంటికి అద్దాలజోడు——



## దృశ్యం ౫౧

ఏదో శబ్దం కొండలమీదనుంచి వచ్చింది——



# దృశ్యం ౧౨

నల్లనివాని వక్షంమీద తెల్లనిదాని కనుమూత—ఎర్రనిరక్తం—



# దృశ్యం ౧౩

ఏదో అనుభవం—



# దృశ్యం ౫౪

ఎక్కడికో వెళ్తున్నాం—



# దృశ్యం ౫౫

చచ్చిపోయిన కొడుకుకై చావనితల్లి ఏడ్చింది—



## దృశ్యం ౫౬

భర్త నవ్వేడు—భార్య నవ్వింది—



## దృశ్యం ౫౭

పిల్లి మొగ్గలేస్తూవస్తే పసిపిల్లలికి ఒక టేనవ్వు—



## దృశ్యం ౭౮

అఖండంగా వెలిగిపోతున్న జ్యోతి—



## దృశ్యం ౭౯

నది, సముద్రంకోసం పరుగెత్తింది—

సముద్రం పొంగిపోతూ నదిని హస్తాలతో ఆహ్వానంచేసింది —



## దృశ్యం ౬౦

“ ఏదో చూసేను,—

“ ఏదో విన్నాను,—

"ఏదో చేసేను"—

విని, "ఊఁ"—



## దృశ్యం ౬౧

నేను—అది—



# దృశ్యం ౬౨

"ఊఁ"

"ఉఁహూఁ!"



# దృశ్యం ౬౩

రథం—చక్రం—మహా వేగం—కీచుకీచు—



# దృశ్యం ౬౪

పొడుం—ఘాటు—తల తేలిక—



# దృశ్యం ౬౫

నరహత్య—గద్దలికి భిక్ష—



# దృశ్యం ౬౬

నేను—ఉన్నానో!—లేనో!



# దృశ్యం ౬౭

కొత్తస్థితి—పిట్టలు—జంతువులు——

వాటి ఆధిక్యత—రాజ్యం—

మనుష్యులు వాటి ఉపయోగవస్తువులుగా శాసింపబడ్డారు—



## దృశ్యం ౬౭

కొండెక్కింది—దుర్భిణిచేతిలో-చుట్టూ మేఘం— అయోమయం-



## దృశ్యం ౬౮

అగ్నిజ్వాల—నీళ్లజల్లు— భగ్గు—



## దృశ్యం ౨౦

నీళ్లకుండ ముక్కలైంది—నీళ్లుపడి మొక్క మొలిచింది—



## దృశ్యం ౨౧

ఈగనీడ—సూర్యునికి కొంత ఆటంకం—



## దృశ్యం ౭౨

విమానప్రయాణం—ఎక్కడనుండో!—ఎక్కడికో!—



## దృశ్యం ౭౩

పద్మవ్యూహం—



